చెఱియొకచివరను మఱియొక చాపకొయ్యకు కట్టి. తానును మధ్యకట్టు కొనెను. కీడులో మేలుదైవమనుగ్రహించి నాకాయుపాయమును తోపించి నందున. అప్పుడే మృతినొందక నాకష్టకథలను మీవంటివారికి చెప్పు చుండుటకయి భూమిమీఁద బ్రతికితిని. ఈప్రకారముండఁగా మఱినాలుగు నిమిషములకు మేమున్నయోడ యొకపర్వతమునఁ గొట్టుకొని దారుణ ధ్వనితో ముక్కముక్కలుగాపగిలిపోయెను. ఆయుశ్శేషముకతంబున మేము చాపకొయ్యనంటిపట్టుకొని నీళ్ళపయినితేలి కొట్టుకొని పోవుచుంటిమి. నేను నాప్రాణముతో మఱియిద్దరిప్రాణములనుకూడఁ గాపాడవలసిన వాఁడనుగనుక భార్యకేమియు తోడుచూపలేకపోయితిని. అందుచే నా భార్య తనయిరువురుపిల్లలతోను ప్రవాహవేగము ననుసరించి మఱియొక వైపునకు కొట్టుకొనిపోవుచుండెను. అయినను వారు చూపుమేర దూర ములో నుండఁగానే యెవ్వరో చిన్నపడవలోవచ్చి వాని నెక్కించుకొని, కొంతసేపటిలోనే దృష్టిపథమును దాఁటిపోయిరి. వారినట్లు తమపడవలో నెక్కించుకొన్నవాండ్రు రామనాథపురమునుండి చేఁపలఁ బట్టుటకయి వచ్చిన పల్లెవాండ్రయి యుందురని నేనూహచేసికొంటినిగాని, ఆతీసిన వారెవరో తరువాత నావారిగతి యేమైనదో నేఁటివఱకును నాకు తెలియనేలేదు. వారు సుఖముగా పడవలో నెక్కించుకోఁబడఁగాఁ గన్ను లార చూచినానుగనుక, నాపిన్నతనందనుని భృత్యుని ఏలాగుననైన బ్రతి కించుకోవలెనని సముద్రముతోఁ బోరాడుచుండుటతప్ప నాకప్పుడు మాఱుచింత లేకపోయెను. ఈప్రకారము సముద్రములోఁబడి ముందుకు వెనుకకు అలలీడ్చినట్లెల్లఁబోవుచుఁదిరుగుడుపడుచుండ, దైవికముగా నా సమయమున ఆమార్గమునఁ జనుచున్న యోడలోని మనుష్యులు దూర మునుండి మమ్ముఁజూచి. తమయధికారికిఁ జెప్పినవాతఁడును సదయహృద యుఁడయి యోడను మాదగ్గఱకుఁబట్టించి మమ్మందెక్కించుకొనియెను. పడవవారందఱును మున్ను నన్నెఱిఁగినవారగుటచేత, సమస్తవిధముల

నన్నాదరించి, సకలోపచారములు చేయుచు సుఖముగా మథురాపురము నకుఁ గొనిపోయి విడిచిపెట్టిరి."

"ఇల్లు చేరినతరువాత సంసారముమీఁది విరక్తిచేత మరల వివాహము చేసికొనక, క్రమక్రమముగా దుఃఖమునంతను మఱచి, ప్రాణముల నన్నిటిని హాచిన్నకుమారునిమీఁదనే పెట్టుకొనిఒకరీతిగా దినములు నెట్టుచుంటిని. ఇట్లు కొన్నియేండ్లు జరగఁగా, నాబహిఃప్రాణమయిన ద్వితీయ పుత్రుఁడు పదునెనిమిది సంవత్సరముల వయస్సుగలవాఁడయి. తనతల్లి యేమయినదని యొకనాఁడు నన్నడిగెను. నేనును గన్నీరు కాలువ లుగట్ట నడచిన సర్వవృత్తాంతమును పూసగ్రుచ్చిన రీతిని వినిపించితిని. అదివిన్నది మొదలుకొని యతనిచిత్తమంతయుఁదల్లిని అన్నను వెదకుటమీఁదఁబోయి తనవలెనే యున్నను బోఁగొట్టుకొని విచారించుచున్న భృత్యునిఁదోడిచ్చి వారిని వెదకఁబంపుమని నన్ను ప్రతిదినమును పీడింపసాగెను. దారపుత్రుల సమాచారమును దెలిసికోవలెనని నాకెంతో యపేక్షగలిగియుండియు, వారినిమిత్తమయి యీయున్నయొక్క కుమారునింగూడఁబంపివేసి యొక్కఁడను నుండ మనసొప్పక, ఇదిగో అదిగో అని సమ్మతింపక కొంతకాలము జరపితిని. ఆపిమ్మట దినదినక్రమమునఁ బుత్రుని నిర్బంధ మెక్కువ కాఁగా, అతని ప్రార్థనను త్రోచిపుచ్చలేక తుదకు నేను సమ్మతించితిని. నా కొమారుఁడును సేవకుఁడును నన్నువదలివెళ్ళినతరువాత, నేఁడువచ్చెదరో రేపువచ్చెదరోయని స్వప్నావస్థయందును వారినేతలఁచుకొనుచు అయిదు సంవత్సరముల వఱకును నోర్చుకొనియుండి, అప్పటికిని వచ్చు జాడ కాన రానందున నింటఁ గాలునిలువక మేరమీఱిన పుత్రస్నేహమున బయలు వెడలి, రెండు సంవత్సరములనుండి క్రమముగా మళయాళము, కన్నడము, కొంకణము, ఘూర్జరము, మాళవము, నేపాళము, బంగాళము, మొదలగు దేశములనెల్ల వెదకి యందెందునుగానక, అచ్చటనుండి దక్షిణాభిముఖుఁడనయి ఓఢ్రదేశము మీఁదుగా నాంధ్రదేశము ప్రవేశించి

యుండించుకయు వారిజాడ తెలియక విసిగి వేసరి వారియాశనిరాశ చేసి కొని యింటివంక మరలివచ్చుచు మనుష్యులు వాసము చేయు దేశము లలో దేనిని వెదకకుండఁ బోవబుద్ధిపుట్టక, చూపునకైన నొప్పకొని, కడ కీదేశముచొచ్చితిని. ఈదినముతో నిచట నాకథాశేషమయినది. నాకిప్పు డేమియు వేఱువిచారము లేదుగాని, నాపుత్రకళత్రాదులు జీవముతో నున్నారన్న శుభవార్త నాచెవిని బడిన సంపూర్ణసంతోషముతో నీదేహ మును విడుతునుగదాయని మాత్రము విచారపడుచున్నాను."

అని, అదృష్టహీనుఁడయిన యావర్ధమానుఁడు తన దుర్దశావర్ణన మును ముగించెను. పాప మీయభాగ్యుఁడు దేశాంతరగతుఁ డయిన కొమారునిమీఁది ప్రేమచేతనే తనకిట్టి మహోపద్రవమును దెచ్చిపెట్టు కొనెఁ గదాయని కొంతదయపుట్టి, రాజు ఈప్రకారముగాఁ జెప్పెను. "రాజునకుసహితమలంఘ్యములగుమాదేశరాజశాసనములకు విరుద్ధము కాకుండెనేని, సంతోషపూర్వకముగా నిన్నివఱకే క్షమించి విడిచిపెట్టి యుందుము. రాజశాసనమీవిషయములో నెంతో క్రూరముగానున్నది; మేమేమి చేయుదుము? మేముచేసిన నిబంధనలను మేమే తగవుమాలి యతిక్రమించుట మాగణ్యతకుందగినపనికాదని నీకునుం దెలియునుగదా? న్యాయమునుబట్టి మాచట్టముల విధులప్రకారము నిన్నిప్పుడే చంపింప వలసినది మాకర్తవ్యకృత్యమయినను నీ కొక్కయుపకారము మాత్రము చేసెదము. నీయావచ్ఛక్తిని వినియోగించి యేలాగుననైన నీవీసాయం కాలము లోఁగా ఈగ్రామములో నెవ్వరియొద్దనైన బదులుచేసికాని యెవ్వరినైన వేఁడికొనిగాని, తెచ్చియపరాధము విధించినధనమును చె ల్లింపుము. నీకీదినము గడువిచ్చినారము; పొమ్ము" అని కారాగృహాధిపతి వశమున నాతనిని బంపెను. అయినను రాజెంతో యనుగ్రహపూర్వక ముగానిచ్చినయీయాగడువువర్ధమానునకెంతయుపకారముగాకనఁబడలేదు. కాంచీపురములోఁ దన్నెఱిఁగినవా రెవ్వరును లేనందునను, తనమొగ

మెఱుఁగని క్రొత్తవాఁ డొకఁడు ఋణరూపమునఁగాని దానరూపమునఁ గాని యొక్క విదేశీయునినమ్మి దండుగ చెల్లించునిమిత్త మంతసొమ్మిచ్చు నన్న యాశను పెట్టుకొనుట కవకాశము లేదుగనుకను ప్రాణములమీఁది యాశ వదలుకొని, కాని దేశములో దిక్కుమాలినపక్షి నయితినిగ దాయని యొక్కఁడును వర్ధమానుఁడు కారాగృహాధికారితో వెడలిపోయెను.

వర్ధమానుఁడు కాంచీపురమునఁ దన్నెఱిఁగినవా రెవ్వరును లేరను కొన్నాఁడు; కాని, యానిమిషముననే తానెవరినిమిత్తమయివచ్చి ప్రాణములు గోలుపోవలసిన దురవస్థను తెచ్చిపెట్టుకొనెనో యాకొమారుఁడును పెద్దకొమారుఁడునుగూడ ఆపట్టణముననేయుండిరి. అన్నను దల్లిని వెదకుటకయి బయలుదేఱిన వర్ధమానుని ద్వితీయపుత్రుఁడు చిన్నవసంతకుఁడు తన సేవకునితోఁగూడ ఆదినముననే కాంచీపురమునకు రాఁ దటస్థించెను. ఆతఁడును మధురవర్తకుఁడేకనుక తండ్రికి ప్రాప్తించిన దురవస్థయే కొంచెముసేపులో నాతనికిని సంభవింపవలసి వచ్చునుగాని, యింతలో నతని యదృష్టమువలన నొకస్నేహితుఁడు కనఁబడి నాఁటియుదయకాలమున నచ్చటకువచ్చినందున ముసలివాఁడైన మధురాపురపు వర్తకునకువచ్చిన గొప్పయాపదను చెప్పి, ఆంధ్రదేశపు వర్తకుఁడనని పేరు పెట్టుకొమ్మని యాతని కాలోచన చెప్పిపోయెను. అందునకు వసంతకుఁడొప్పుకొని, తనదేశస్థుఁడొకఁడు ప్రాణాంతోపద్రవములో నున్నాఁడని వినుటవలన నెంతయు సంతాపించెనేకాని, యాతఁడే తనతండ్రియన్న మాటమాత్రము లేశమయిన నాతని మనసునకు తగులలేదు.

వర్ధమానుని పెద్దకొమారుఁడు పదియేను సంవత్సరముల నుండి కాంచీపురములోనే యుండి యిప్పుడు గొప్ప భాగ్యవంతుఁడై యున్నందున, తండ్రిప్రాణములను గాపాడుటకై యెంతసొమ్మయిన నిచ్చి విడిపింపఁ గలిగినంత శక్తిగలవాఁ డయి యున్నాఁడు. కాని తండ్రిసంగతి యాతని కేమియుఁ దెలియదు. నాఁడట్లు తల్లితోఁగూడ బెస్తలచేత సము

ద్రమునుండి వెలికిఁదీయఁబడినప్పుడు కడుఁబసివాఁ డగుటంజేసి తానా ప్రకారమురక్షింపఁబడెననిమాత్రముజ్ఞప్తియుంచుకొనెనేకాని, తరువాత తల్లిదండ్రులగతి యేమయినదో యతని కెంతమాత్రమును తెలియలేదు. ఈవసంతకునిని తల్లినిఁదీసిన చేఁపలవాండ్రు, అదృష్టహీనురాలయినతల్లి కడుపుశోకమునఁ బొగులుచుండఁగా పిల్లల నామె నెడఁబాపి తెచ్చి కొంతకాలము పెంచి, తరువాత వారినిద్దఱను గొనివచ్చి యమ్మఁజూపిరి. వారిలో వసంతకుని రూపలావణ్యాదుల కాశ్చర్యపడి, కాళహస్తికధీశ్వరుఁడునుధర్మపాలుఁని మేనమామయునగుసుబలుఁడను మహావీరుఁడువారి నిరువురనుగొని పుత్రవాత్సల్యముతోఁ బెంచుచుండెను. అతఁడొకసారితన మేనల్లుని జూడఁబోయినప్పుడు వారినిరువురను కాంచీపురమునకు వెంటఁ బెట్టుకొనిపోయెను. ధర్మపాలుఁడు వసంతకుని జూచిన వేళావిశేషమునఁ నాతనియందు ప్రేమగలవాఁడయి, యాతని భృత్యునితోఁగూడఁ దన యొద్ద నేయుంచుకొని, పెద్దవాఁడయిన తరువాత తనసైన్యములో నొక నాయకునిగాఁ జేసెను. వసంతకుఁడును ప్రభుభక్తిగలవాఁడయి శౌర్యధైర్యాది గుణములచే యుద్ధములమిక్కిలిప్రసిద్ధికెక్కి, ఒకయుద్ధమునఁ దన ప్రాణమున కాశపడక ప్రాపకుఁడయిన రాజుయొక్క ప్రాణమును బహుసాహసముతో కాపాడెను. అందుచే రాజునకతనియెడఁ బరిపూర్ణానుగ్రహమువచ్చి, గొప్ప బహుమానము చేయుటయేకాక తన దేశములో మిక్కిలిభాగ్యవంతుఁడయినధనదాసుని కొమార్తెను సీతనిప్పించి వివాహము చేయించెను. తండ్రి యీపట్టణమునకు వచ్చిన సమయమందు తన భృత్యుఁడయిన లక్ష్మణునితోఁగూడ నతఁడు కాంచీపురమునసే భార్యాసమేతుఁడయి నివసించియుండెను.

ఆంధ్రదేశమునసుండి వచ్చితిననుమని యాలోచనచెప్పిన స్నేహితుఁడు వెళ్ళినతరువాత చిన్నవసంతకుఁడు తన సేవకుఁడయిన చిన్న లక్ష్మణునిచేతికిఁ గొంతసొమ్మిచ్చి, తాను తిరిగివచ్చినదాఁక సత్రమువద్ద

భద్రముగాఁ గాచుకొని యుండుమని నియమించి తానింతలో వెళ్ళి పట్టణము నాలుగుమూలలను తిరిగి, జనులయొక్క యాచార వ్యవహారములనుజూచి, భోజనపువేళకు వచ్చెదనని చెప్పిపోయెను. లక్ష్మణుఁడు వాక్చమత్కృతికలవాఁడును ఉల్లాసపురుషుఁడును గనుక, వసంతకుఁడు తనమనసులో విచారముగానుండి ప్రొద్దుజరగనప్పుడెల్లఁ దన భృత్యునిఁ బిలిచి యతనితోడి వేడుకమాటలతోను హాస్యవచనములతోను గాలక్షేపము చేయుచుండును. అందుచేత సాధారణముగా యజమానులకడ సేవకులకుండు దానికంటె, వసంతకునికడ లక్ష్మణున కెక్కువ స్వాతంత్ర్యమును చనవును గలిగియుండెను.

చిన్నవసంతకుఁడు తన సేవకుని వదలి వెళ్ళినతరువాత, ఒకచోట నిలుచుండి, తాను సోదరునిని తల్లిని వెదకుటకయి యొంటిగా బయలుదేఱి దేశ దేశముల వృథాతిరుగుచుండుటయు, తాను తిరిగినస్థలములలో నెక్కడను వారి వర్తమాన మించుకయు తెలియకుండుటయు తలఁచుకొనుచు, తనలోఁ దానిట్లనుకొనుచుండెను: "మహాసముద్రములో నొక జలబిందువు మఱియొక జలబిందువును వెదకుటకు బయలుదేఱి యా మహార్ణవములోఁ దాను సహితము కనఁబడక యడఁగిపోవునట్లు, మందభాగ్యుఁడనయిన నేనును తల్లిని సోదరుని వెదకుదునని పనికట్టుకొని బయలుదేఱి యిల్లు విడిచి వాకిలివిడిచి కానిదేశములో పరిభ్రమించుచున్నాఁడను." అని యీప్రకారముగా తానుచేసినప్రయాణములనుగూర్చి యాలోచించుచుండఁగా, అక్కడకు పెద్దలక్ష్మణుఁడు వచ్చెను. చిన్నవసంతకుఁడు ఆవచ్చినవాఁడు తన లక్ష్మణుఁడేయనుకొని, అంత వేగముగా వచ్చినందునకద్భుతపడుచు, "సొమ్మెక్కడఁబెట్టివచ్చినా"వని యడిగెను. ఇద్దఱు లక్ష్మణులును ఇద్దఱు వసంతకులును చిన్నతనమునందువలె నిప్పుడును ఏకరీతిగానే యుండియున్నందున, ఇట్టి భ్రమలు పుట్టుట యాశ్చర్యముకాదు. చిన్నవసంతకుఁడట్లడుగఁగా, ఆమాటల తాత్పర్యము తెలి

యుక యాతనిని తన యజమానునిగా భావించి, అతఁడు తనవచ్చినకార్యమును వాస్తవముగానే యిట్లుచెప్పెను. "మీరే వేళకు నింటికి రాకుండుట, వేగిరము భోజనము నిమిత్తము మిమ్ముఁదీసికొనిరమ్మని అమ్మగారు నన్ను పంపఁగా వచ్చినాను. పొయిమీఁదిపులుసు ఇగిరిపోయినది; అన్నమును కూరలును చల్లారిపోయినవి. వేగిరమురండి." ఆమాటలు పరిహాసముగాఁ జెప్పుచున్నాఁడనుకొని, యతఁడు "పరిహాసమునకిది సమయముకాదు. సొమ్ముతీసికొనిరాక, యూరకే వచ్చినావేమి? నిజము చెప్పుము" అనియడుగఁగా వాఁడు మరల నెప్పటియట్లు "నిజముగా ఏసొమ్మో నేనెఱుఁగను; అమ్మగారు భోజనమునకుఁ బిలుచుకొనిరమ్మన్న వచ్చినాను" అనిచెప్పెను. ఆప్రత్యుత్తరమునకుఁ గోపమువచ్చి "అమ్మగారెవరురా?" అని వసంతకుఁడు కోపదృష్టితోఁ బలికెను. "ఎవరా? మీరు విధ్యుక్తముగా వివాహము చేసికొన్నభార్యగారు" అని లక్ష్మణుఁడుమాఱుపలికెను. అతనికి భార్యలేదుగనుక, ఆమాటల కొడలు మండి కన్నెఱ్ఱచేసి, "ఓరీ! నేను నీతోఁగొన్నివేళలఁ జనువుగా మాటాడుచున్నానని నెత్తికెక్కి, యీప్రకారముగా సమయమెఱుఁగక హేళనము చేయుచున్నావు నేనిప్పుడు మనస్సులో నుల్లాసముగా లేను జుమీ భద్రము! మన మీగ్రామమునకు క్రొత్తవారమయియుండఁగా, అంతసొమ్మెవ్వరియొద్ద నమ్మి పెట్టివచ్చినావో శీఘ్రముగాఁజెప్పు." అని యదలించెను. లక్ష్మణుఁ డాతనిఁ దనయజమానుఁడే యనుకొనుచున్నాఁడు కాఁబట్టి, 'ఈగ్రామమునకు మనముక్రొత్తవార' మన్నమాటచేత హాస్యమాడుచున్నాఁడనినిశ్చయించి, నవ్వుచు "అయ్యా! మీరు భోజనము చేసి కూర్చున్నతర్వాత సావకాశముగా అమ్మగారితోను ఆమె చెల్లెలితోను వలసినంతసేపు హాస్యమాడవచ్చును. ప్రొద్దుననుండి భోజనము లేక యింటనందఱు మలమలమాడుచున్నారు. సొమ్మునను గిమ్మునను నాకు తెలియదు. వేగిరము వెళ్ళుదమురండి" అని, పిలిచెను ఈమాటలతోఁ

జిన్నవసంతకునిశాంతమంతయుపోయి, 'నీఅమ్మగారిని, గృహములోనుపోలుు తగులఁబెట్టు' మని, లక్ష్మణుని నాలుగు దెబ్బలు గొట్టెను. ఆదెబ్బలతో వాఁడింటికిఁ బరుగెత్తుకొని పోయి, తన యజమానుఁడు భోజనమున కింటికి రావన్నాఁడనియు, ఇల్లును లేదు భార్యయును లేదు పొమ్మని తన్నుఁ గొట్టినాఁడనియు, మొగమింత చేసికొని తనయజమానురాలితోఁ జెప్పెను.

పెనిమిటి తనకు భార్యలేదన్నాఁడన్నమాట చెవి సోఁకినతోడనే సీత కన్నులనీరు పెట్టుకొని కొంతవడి చింతించి తనకుఁదాన యుపశమించుకొని, నీవే మఱియొకసారి వెళ్ళి నాథుని నింటికిఁ బిలుచుకొని రమ్మని భృత్యునిఁ బంపివేసి, తానెప్పుడును బెనిమిటిమీఁద జారత్వశంకను బెట్టుకొనియే యుండునదిగాన నాతఁడిప్పుడు మఱియెవ్వతెనో మరిగి తన మీఁది ప్రేమను విడనాడి యట్లన్నాఁడని యాతనిమాటల కర్థముచేసి, పెనిమిటిని బహువిధముల నిందించుచు దుఃఖపడఁజొచ్చెను. అప్పుడామె చెల్లెలు సుభద్రవచ్చి యీప్రకారముగా మనసులో నిష్కారణముగా లేని పోని యనుమానము నొకదానిని పెట్టుకొని, ప్రాణవల్లభుఁడయిన వసంతకుని మిగులనాడుచు దుఃఖమునొందుట ధర్మముగాదని యప్పగారిని బోధించి, ఆమెను వెంటఁబెట్టుకొని బావగారిని పిలుచుకొనివచ్చుటకయి బయలుదేఱెను.

చిన్నవసంతకుఁడు సత్రముదగ్గఱకు వెళ్ళి చూచునప్పటికి, తనలక్ష్మణుఁడు సొమ్ముతోఁగూడ సుఖముగా వీధిగుమ్మములో నిలుచుండఁగాఁ దనతో నల్లుసొమ్ము లేదని హాస్యమాడుటనుగూర్చి మందలించుచుండెను. అతఁడు తానేకర్మమును నెఱుఁగనని బదులుపలుకుచుండెను. అప్పుడు సీత యాతనియొద్దకువచ్చి తనభర్తయను నమ్మకముతో హస్తముపట్టుకొని రమ్మని లాగుచు, "ఓప్రాణనాయకా! ఇదియేమిపాపము? నన్నెప్పుడును జూడనివానివలె వింతపడి నామొగమువంక బెదరిబెదరి చూచుచున్నావు! నామీఁద నుమనుపటిమోహమంతయు ఏగంగలో కలిసినది? చేసికొన్న

భార్యనుగాదని యన్యమోహనాంగిపై నీవలపునిలువ నెట్లు మనసుపుట్టినది?" అని నయనిష్ఠురములాడుచు, బొటబొటఁ గన్నీరు కార్పసాగెను. నిజముచేత వసంతకుఁడు జన్మమెత్తినతరువాత ఆమె మొగమునైనఁ జూచినవాఁడుకాఁడు. ఇట్లు అన్యకాంతవచ్చి 'నీవునాభర్త'వనిచేయిపట్టుకొని యీడ్చుచుండ నాశ్చర్యకోపంబులు మనంబునఁ బెనంగొన, దేహముకంపింపఁ జేయి తెమల్చుకొనుచు, "ఓయన్యతోదరీ! నాయొద్దనా యిప్పుడు నీప్రాగల్భ్యము చూపవచ్చితివి? చాలుఁజాలు. ఇఁకమాటాడక నీదారిని పో పో"మ్మని గదిమి, అంతటం బోకున్న దానామె పెనిమిటిని గాననియు, రెండుగంటలక్రిందనే యీపట్టణమునకు వచ్చినాననియు, అతఁడు చెప్పఁగలిగినట్లెల్ల నయమున భయమునఁ జెప్పిచూచెనుగాని, యామదవతిముందఱ నాతనివాక్యములన్నియు వఱదఁగలిసిపోయెను. ఆమె చేయివదలక, 'నాముందఱ నెందుఁబోయెద వింటికిరమ్మ'ని నిర్బంధించి యీడ్వఁగా, ఆమెను తప్పించుకొనిపోవ శక్యముకాక, కడకామెతోఁగూడ తనసహోదరునియింటికి వెళ్ళి, విధిలేక యచ్చటభోజనమునకుఁ గూర్చుండెను. అప్పుడామె 'ప్రాణేశ్వరా!' యనియు ఆమెచెల్లెలు 'బావా!' యనియుఁ దన్నుఁబిలుచుచుండఁగా వింతపడియి దేమైననింద్రజాలమో నేనిప్పుడు కలగనుచున్నానోయని తలఁచుకొనుచు, మఱి మఱి యద్భుతపడసాగెను. తనస్వామితోఁగూడ వచ్చిన లక్ష్మణుఁడు తానువంటయింటికిఁ బోయినతోడనే యచట నాతనిసోదరునిభార్య గారి తన్ను భర్తయని పిలువఁజొచ్చినందున భృత్యుఁడు యజమానునికన్నను అద్భుతపడుచుండెను.

అప్పుడు సీతచేఁ బంపఁబడిన పెద్దలక్ష్మణుఁడు తన యజమానునిఁ గలిసికొని, 'మీభార్యమిమ్ము భోజనమునకు రమ్మన్నదని చెప్పిన తప్పిదమునకై నిమిషముక్రింద నన్నునిష్కారణముగాఁ గొట్టితిరిగదా? ఇప్పుడయిన వచ్చెదరా? మరలఁగొట్టెదరా?' యని యడుగఁగా నాతడద్భుతపడి, ఆసంగతి యేమో తా నెఱుఁగననెను. ఆపిమ్మట నామెయొక్క

నిజమయిన భర్త పెద్దవసంతకుఁడు తన సేవకునితోఁగూడ బయలు దేఱి, చిన్నవసంతకుఁడు లోపల భోజనము చేయుచున్న సమయమున భోజనార్థ మింటికివచ్చి, తలుపుదగ్గఱఁ బిలిచెను. తమయజమానురా లావలఁ కే యెవరువచ్చినను దలుపుతీయవద్దని యుత్తరువు చేసిపోయినదిగనుక, భృత్యులెవ్వరును దలుపుతీయరైరి. అంతటితో వారు వెనుక మరలక, 'మేము వసంతకుఁడును లక్ష్మణుఁడును వచ్చినాము తలుపుతీయుఁడని' కేక లు వేసిరి. లోపలివా రామాటలకు పకపకనవ్వి, వసంతకుఁడీవలఁ కేవచ్చి తనభార్యతో లోపల భోజనము చేయుచున్నాఁడనియు లక్ష్మణుఁడు వంటయింటనే యున్నాఁడనియుఁ జెప్పి తలుపు తీయకపోయిరి. వారు తలుపు బద్దలగునట్లుగా గుద్ది యఱచినను కార్యము లేకపోయినందున, ప్రాణమువిసిగి వసంతకుఁడు తనభార్యతో నెవఁడో లోపల భోజనము చేయుచున్నాఁడని వినుటవల్ల వింతపడుచు, తుదకు మిక్కిలి కోపముతో భృత్యునిఁదోడ్కొని యక్కడనుండి లేచిపోయెను.

చిన్నవసంతకుఁడు భోజనము చేసినతరువాత, సీత యింకను పట్టిన పట్టును విడువక తన్నుభర్తఁగానే చూచుకొను చుండుటచేతను, ఇంతలో లక్ష్మణుఁడువచ్చి తన్నును వంటకత్తెయొక తెపెనిమిటియని పట్టు కొన్నదని చెప్పుటచేతను, మఱింత వింతపడి యెప్పుడయినఁ గొంచెము సందు దొరకెనా లేచిపోదమని నిశ్చయించుకొనియుండెను. అతఁడు భోజనము చేయునప్పుడు సుభద్ర చేసిన యాదరణకుమిక్కిలి సంతోషించి నను, మనసులో జారత్వశంక పెట్టుకొని మాటిమాటికి చిఱచిఱ లాడు చున్న సీతకృత్యములకు మనోవ్యథగలవాఁడై యుండెను. వంటయింట పిశాచమువలెఁ బట్టుకొని వదలకున్న క్రొత్తభార్యనుజూచిన, లక్ష్మణున కంతకన్న నొడలుమండుచుండెను. కాఁబట్టి వారిరువురును ఎప్పుడు సమ యము దొరకునా, యారక్కసలచేతులలోనుండి యీవలఁబడి యెప్పుడు బ్రతుకుదుమాయని నిమిష మొకకల్పముగాఁ గడపుచుండిరి.

ఒక యుపాయముచేత వారి నేమఱించి తప్పించుకొని వీధినిబడి చిన్నవసంతకుఁడు పోవుచుండఁగా, ఒక కంసలవాఁ డెదురుపడి యాతనిని పెద్దవసంతకునిగా భ్రమించి, 'వసంతకా!' యని పేరుపెట్టి పిలిచి, 'ఇదిగో నీవు చేయుమన్నచంద్రహారమయినది పుచ్చుకొమ్మ'ని చేతికిచ్చెను. వసంతకుఁడిది నాదికాదని మరల నియ్యఁబోఁగా, వాఁడుపుచ్చుకోక, 'మీరు చేయుమన్న మీయుత్తరువు ప్రకారము చేసినానుగాని లేకున్న నాకెందు'కని, దానినతనియొద్దనే వదలిపెట్టి వెళ్ళిపోయెను. ఇటువంటి యింద్రజాలములు జరుగుచున్న యీపట్టణములో నిఁక నర్ధనిమిషమయిన నుండఁగూడదనుకొని, చిన్నవసంతకుఁడు తనసేవకుని బిలిపించి 'నీ విప్పుడే బండి కుదుర్చుకొనివచ్చి శీఘ్రముగా మనసరకులను దానిమీఁద నెక్కింపుము పోద'మని యుత్తరువు చేసెను.

చంద్రహారమును భ్రమపడి చిన్నవసంతకున కిచ్చిపోయిన కంసల వాఁడు తానితరులకు ఋణపడియున్న సొమ్ము నిమిత్తము కొంచెము సేపటికి రాజభటులచేతఁ బట్టుకోఁబడెను. ఇట్లు రాజభటులు వానిని బట్టుకొని తీసికొనిపోవుచున్న సమయమున, వాఁడు చంద్రహారమునిచ్చితి ననుకొన్న పెద్దవసంతకుఁ డాత్రోవనే పోవుచుండుట తటస్థించెను. అప్పు డాకంసలవాఁడు వసంతకునిఁబిలిచి, "అయ్యా! యింతకుమునుపు నేను మీచేతికిచ్చిన చంద్రహారముయొక్క కూలి దయచేసెదరేని సమయము నకు మిక్కిలి యక్కఱకువచ్చును. మీరియ్యవలసిన కూలి నేను బాకిపడి యున్న సొమ్ముమొత్తమునకు సరిపోవును కాఁబట్టి దానినిచ్చి వేసిన, రాజభటులు నన్ను విడిచిపెట్టుదురు." అని, యడిగెను. వసంతకుఁడు వానిమాటల కచ్చెరువడి, "నీ వేమి! నా కేమి! చంద్రహార మిచ్చుటేమి? లేదుపొమ్మ"నెను. కంసలవాఁడు "నిమిషముక్రిందటనే కదా మీచేతికిచ్చి పోతిని. ఇంతలోనే లేదనుచున్నారిదియొక్కడి యన్యాయము"మని కేకలు వేసెను. ఈప్రకారముగా నిరువురును తనపతమే న్యాయమయిన దను

నమ్మకముతో గట్టిగా నిచ్చితినని కంసలవాఁడును, అట్టి నమ్మకముతోనే నాకెంతమాత్రము నియ్యలేదని వసంతకుఁడును, నడివీధిలోఁ దగవులుపడు చుండిరి. వసంతకుఁడు తనకు వాఁడు చంద్రహారమియ్యలేదని మనసులో రూఢిగా నమ్మియుండెను. కంసలవాఁడు అతనితమ్ముని నతనిగా భ్రమించి చంద్రహారము నిచ్చినమాట వాస్తవమేయైనందున, వసంతకునకు నగ నిచ్చితినని చిత్తమున దృఢముగా నమ్మియుండెను. ఇట్లు మంచిమాటలతో కూలియిచ్చుమార్గము కనఁబడనందున, వాఁడు వసంతకునిఁగూడఁ బట్టు కొని ధర్మాధికారులకడకుఁ దీసికొనిరండని రాజభటులను వేఁడుకొనెను. వారాతని ప్రార్థనప్రకారము వసంతకునిఁగూడఁ బట్టుకొని, ధర్మస్థాన మునకుఁ దీసికొనిపోవుచుండిరి.

ధర్మస్థానమునకుంబోయినందున కేమియవమానమువచ్చునోయని భయపడుచు వసంతకుఁడు రాజభటునివెంటఁ బోవుచుండఁగా, ఇంతలో నతని సోదరుని సేవకుఁడైన చిన్నలక్ష్మణుఁడు బండి కుదుర్చుకొని, ఆ సంగతి తన యజమానునితోఁ జెప్పుటకయి వచ్చుచుండెను. వానినిఁజూచి వసంతకుఁడు తనసేవకుఁడే వచ్చుచున్నాఁడని యెంచుకొని కోంతసంతో షించి, వాఁడేమో చెప్పవచ్చుచుండఁగా ఆమాటనువినక, "లక్ష్మణా! నీవుపరుగెత్తుకొనిపోయి సీతతో నాయవస్థచెప్పి, తాళపుపెట్టెలోఁ బెట్టిన రూపాయలమాటను నేనిమ్మన్నానని చెప్పితీసికొనిరా' అని. ఆత్రము తోఁ జెప్పెను ఇదేమిరా యింతకుమును పెంతో కష్టపడి ప్రాణములు తప్పించుకొని యీవలఁబడినయింటికే మరలఁబంపుచున్నాఁడని యచ్చెరు వడి, తనయజమానుని రాజభటులు కొనిపోవుచుండఁగాఁ బ్రత్యక్షమునఁ జూచుచున్నాఁడుగాన హాస్యముకాదని నిశ్చయించుకొని. బండికుదిరినదని చెప్పఁదలఁచియు ఆసమయములోఁ జెప్పనవకాశము లేక, మాఱుమాటా డక బయలుదేఱి సీతయింటికిఁబోవుచు దారిపొడుగునను తనలోఁదానిట్లు చింతింపసాగెను. "అయ్యో! ఆపాడుగృహమునకు పోయినతోడనే గొరి

నన్ను మగుడ మగఁడని పట్టుకొనునేమో! ఈసారి దానినెట్లుతప్పించుకొఁ గలను? సేవకులెప్పుడును అస్వతంత్ర జీవులయి యజమానుల యాజ్ఞలో మెలఁగవలసినవారు కాఁబట్టి పోకతీఱదు " అనుకొనుచు వెళ్ళెను.

వెళ్ళి వీధిగుమ్మములో సీతనుజూచి, వసంతకుని ,రాజభటులు పట్టుకొని ధర్మస్థానమునకుఁ గొనిపోవుచున్నారు; తాళపుపెట్టెలోనున్న రూపాయల సంచిని నాచేతికిచ్చి వేగిరము పంపుమన్నాఁడ'ని· లక్ష్మణుఁడు తొట్రుపాటుతోఁ జెప్పెను. మగనికి ఆపదవచ్చినదన్నమాటలు విన్న తోడనే గుండెలుపగిలి, అతివేగమున లోపలికి పరుగెత్తుకొనిపోయి, పెట్టెతీసి రూపాయలసంచిని తీసికొనివచ్చి లక్ష్మణునిచేతిలోఁ బెట్టెను. లక్ష్మణుఁడాసొమ్ము పట్టుకొనివచ్చుచు త్రోవలో నొకచోటఁ దనయజమానుని గలిసికొనెను. అతఁడు తన కాపట్టణములో జరగుచున్నవిచిత్రముల కాశ్చర్యపడుచు దిగ్భ్రమనొంది,యేమియుందోచక తెచ్చవడినలుదెసలం జూచుచుండెను. అతని సహోదరుఁడాగ్రామమునఁ బేరుపడినవాఁడు గనుక, ఎల్లవారును బూర్వమెప్పుడో యీతని నెఱిఁగినవారివలెనే వీధి పొడుగునను నమస్కారములు చేయువారును, కుశలప్రశ్నముల నడుగువారును, మర్యాదలొనరించువారునునయియుండిరి. కొందఱు మీకుబాకియున్నసొమ్మిదిగోఁ బుచ్చుకొండని యియ్యవచ్చిరి; మఱికొందఱు మీరు చేసిన యుపకారము నెన్నఁడును మఱచిపోమని వంగివంగి నమస్కారములుచేయఁజొచ్చిరి.అతఁడెవ్వరిని నెఱుఁగకపోయినను,ఎల్లవారునీప్రకారముగా నతనిని అతనిసోదరునిగా భ్రమించి సమస్తగౌరవములను జేయసాగిరి. ఇంతలోనొకకుట్టుపనివాఁడువచ్చి ,యిదిగోమీయంగీనిమిత్తము పట్టుబట్టను దెచ్చినాను; కొలతయిచ్చిపొండ'ని వేఁడుకొనియెను. మఱియొకఁడువచ్చి 'మీవస్త్రములు సిద్ధమగుచున్నవి; సాయంకాలము మీ యింటికిఁదెచ్చియిచ్చెద'నని, చెప్పిపోయెను. ఇంకొకఁడు 'నేను మీపని

మీఁదనే యున్నాను; రేపుతప్పక తెచ్చి యొప్పగించెద'నని, వాగ్దానము చేసెను.

ఇదియంతయుఁజూచి మతిపోయి, యెక్కడనో దయ్యాలపోతుల దేశమునకు వచ్చిపోతిమనివిచారించుచుండఁగా, లక్ష్మణుఁడువచ్చి 'మిమ్ము ధర్మస్థానమునకుఁ గొనిపోవుచున్న రాజభటుల చేతులలోనుండి యెట్లు తప్పించుకొనఁగలిగితి'రని యడుగుటయేకాక, మీరు తెమ్మన్న ధనమును మధ్యాహ్నమున భోజనముచేసినయింటికిఁబోయి తెచ్చినానని చేతికిచ్చి వసంతకునిమనస్సునకు మఱింతకలఁతనుబుట్టించెను. 'రాజభటులు' 'పట్టుకొనుట' అని లక్ష్మణుఁడు చెప్పుటయు, సీతనడిగి తెచ్చితి నన్నమాటకు సాక్షిగా సొమ్మును చేతఁబెట్టుటయు, ఆలోచించి వీనికేమో మతిభ్రమ యెత్తినదని సందేహించి తాను మోసపోయి కార్యమునుగానక తిరుగుచుండుట తలఁచుకొని భయోత్కంపము పుట్టఁగా కన్నులు మూసికొని 'భగవంతుఁడా! మమ్మిలాగునవైన నీయాపత్సముద్రములోనుండిబయలఁబడవైచి రక్షింపుమా' యనిదైవముం బ్రార్థించుచుండెను.

ఇట్లుభగవన్నామస్మరణమునుచేయుచుండఁగామఱియొకసుందరి వచ్చి, 'వసంతకా' యనిపిలిచి, మధ్యాహ్నము మాయింట భోజనము చేయునప్పుడు నాకిచ్చెదనన్న చంద్రహారమేదీ యిమ్మని యడిగెను. ఆమాటలతో శాంతమంతయుఁబోయి, వసంతకుఁడు, 'ఛీ! ఛీ! మాయలాడీ! నాకడనేమియుఁ బ్రేలకు'మనిదూషించుచు,నీకునేనెప్పుడునుచంద్రహారము నిచ్చెదననులేదు, మీయింట భోజనముచేయనులేదు, ఇప్పుడు తప్ప వెనుక నెన్నఁడును నీమొగమయినను జూడనులేదు, పొమ్మని కసరెను. ఆమె "నీవు మధ్యాహ్నము మాయింటికివచ్చి భోజనము చేయునప్పుడు చంద్రహారము నిచ్చెదనని నాతోనమ్మకము చేయలేదా? పోనీ నీచంద్రహారము నీయనిపక్షమున నాదగ్గఱఁ బుచ్చుకొన్న బంగారపుఉంగర

పోయిన నాదినాకిమ్ము"ని తగవుచేసెను. దానిమీఁద వసంతకునకు పిచ్చి యెత్తిపోయి, 'దొంగా! బొంకులాడీ' యని తిట్టుచు, నీయుంగరమును నిన్నను గూడ నెఱుఁగను పొమ్మని యచ్చటనుండి కాలికొలఁదిని పరుగెత్తెను. అతనియొక్క చిత్రమయినచర్యకును వెఱ్ఱిచూపునకును ఆశ్చర్యపడి, నేఁడు మధ్యాహ్నమున మనయింటికడ సుఖముగా భోజనము చేసి నీకు చంద్రహార మిచ్చెదనని యాశ పెట్టి నాయుంగరముగూడఁ గొనిపోయినాఁడే, యింత లోనే లేదనుచున్నాఁడే మిదింతయని యామె విచారించుచుండెను. ఆగ్రామములో తక్కినవారందఱును పడిన భ్రమలోనే యీసుందరియుపడి, యీతని నీతని సోదరునిగా నెంచుకొనుచుండెను. వివాహితుఁడైన యీ వసంతకుఁడు ఆమె చెప్పిన కార్యములన్నిటిని చేసినమాట వాస్తవమే.

పరిచారికలు తమయజమానుఁడు లోపలనే యున్నాఁడనుకొని తలుపుతీయనందున, పెద్దవసంతకుఁడు మిక్కిలి కోపముతో గిఱుక్కున మఱ్ఱి లేనిపోని యనుమానములను పెట్టుకొని దీనియింటికి పోయినావని దానియింటికి పోయినావని దోషారోపణము చేయుచు మొగమువాచు కొనియుండి వెనుక నప్పుడప్పుడు తలుపుతీయకుండులాగుననే యీసారి యుండవలెనని భార్య పరిచారికలచేత నిట్లు చేయించినదనియెంచుకొని, తలుపు తీయనందుకు తగిన యనుభవముగుఁగాక యని మఱియొకచోట భోజనము చేయనిశ్చయించి, ఇప్పుడు చెప్పినసుందరియింటికిఁ బోయెను. ఆమె యుపచారవముతో నెదురువచ్చి యర్ఘ్యపాద్యములిచ్చికొనిపోయి, షడ్రసోపేతముగా భోజనము పెట్టినందున సంతోషమువచ్చి, భార్యమీఁది కోపమున నామెకు వంచనగా నుండుటకయి యామెనిమిత్తము చేయించిన చంద్రహారము నిచ్చెదనని వాగ్దానముచేసి, యుంగరము నాతఁడు పుచ్చుకొనెను. ఇందాఁక కంసలవాఁడు తెచ్చి పొఱపాటున చిన్నవసంతకున కిచ్చిపోయినదా చంద్రహారమే. ఆసుందరి తనకు చంద్రహారమువచ్చునన్న సంతోషముతో, వ్రేలియుంగరమునుదీసి వేగిరము చేతికిచ్చెను.

ఆయుంగర మతఁడు పుచ్చుకొని లేదనుచున్నాఁడనుకొని మిఱ్ఱిమిఱ్ఱి చూపులుచూచుచు పిచ్చికోపముతో కానిమాటలాడియీవఱకెన్నఁడును నీమొగమే యెఱుఁగనని యాతఁడు పాఱిపోయినందున, ఆతనికి చిత్తచాంచల్యము కలిగినదని యెంచుకొని, యాతని భార్యయొద్దకుఁ బోయి నీ మగనికి పిచ్చియెత్తినదని చెప్పనిశ్చయించుకొని బయలుదేఱెను. అట్లు కదలిపోయి యాసంగతిని సీతతోఁ జెప్పుచుండఁగా, పెద్దవసంతకుఁ డొక రాజభటునివశమునఁ బంపఁబడి, యీవఱకు చిన్నలక్ష్మణుఁడు వచ్చితీసికొనిపోయి తనయజమానునకు సమర్పించినమాటనే పెట్టెతాళముతీసి తెమ్మనిభార్యనడిగెను. ఆమాట నాలక్ష్మణుఁడు కొనిపోయి తన సోదరున కిచ్చినమాట యీ వసంతకుఁ డేమియు నెఱుఁగఁడు. ధర్మాధికారి యాతని నెఱిఁగినవాఁడుగనుక, ఇంటికిపోయి యాభటునివశమునసొమ్మిచ్చి పంపుమని సెలవిచ్చినందున ఆతనితోడసొమ్మునిమిత్తమైవచ్చెను.

ఇప్పుడు వసంతకుఁడు మధ్యాహ్నము భోజనమునకువచ్చినప్పుడు తలుపు తీయనైతివని భార్యను మందలించుటయేకాక, మనుష్యునిఁ బంపినను ఆపత్సమయమున సొమ్మియ్యకపోతివిగదాయనిదూషించినందున, తనపెనిమిటికిపిచ్చియెత్తినదని యాసుందరిచెప్పినమాటయసత్యము కాదని సీత గట్టిగానమ్మెను. భోజనము చేయుచున్నంతసేపును నతఁడు నేను నీ పెనిమిటినేకాననియు, ఈదినము వఱకును తానెప్పుడును కాంచీపురమునకే రాలేదనియు, అనుచుండుట స్మరణకువచ్చి, తన మగనికి నిస్సందేహముగా పైత్యచలనము కలిగినదని నిశ్చయము చేసికొనెను. కాఁబట్టి రాజభటునకియ్యవలసినసొమ్మునిచ్చి యాతనినిపంపివేసి, ఇంటఁగల పరిచారకుల నందఱినిపిలిచిమీాఁరితనిని త్రాళ్ళువేసి కట్టిపెట్టి చీఁకటిగదిలో భద్రముచేసి చికిత్స చేయించుటకై వైద్యునినిమిత్తము మీాలో నొకఁడు వేగిరము వెళ్ళుఁడని యాజ్ఞచేసెను. పరిచారకులాతనిఁ బట్టుకొని నిష్కారణముగా కట్టుచున్నప్పుడతఁడు తనకేమియు చిత్తచాంచల్యము

లేదనియు వృథాగా కట్టుచున్నారనియు మొఱపెట్టెను. కానియాసమయములో నాతని మొఱ్ఱ నాలకించినవారెవరును లేకపోయిరి. పాపము! సోదరుఁడును అతఁడును ఏకరీతిగానున్న దోషమువలననే పెద్దవసంతకున కిప్పుడీయవస్థ తటస్థించెను. అతఁడు కట్టనీయక పెనఁగులాడుచు కేకలు వేసి కోపపడినకొలఁదిని, చెంతనున్నవారి కాతఁడు పిచ్చివాఁడను నభిప్రాయము బలపడసాగెను. ఇంతలో లక్ష్మణుఁడువచ్చి, రూపాయలమూట నేమిచేసితివిరాయని యడుగఁ దెల్లపోయి తానామూట సంగతినే యెఱుఁగనని తత్తఱపడుటయెకాక మధ్యాహ్నము భోజనమునకు వచ్చినప్పుడు తలుపు దీసినారుకారని యజమానుఁడు చెప్పిన కథనే యేకరువు పెట్టినందున, స్వామికిపట్టిన పిచ్చియే సేవకునకును పట్టినదని నిశ్చయించి, యతనినిగూడకట్టి కొనిపోయి వసంతకునికి తోడుగా ఆచీఁకటి గదియందే యుంచిరి.

అంతట మగనిని లోపల భద్రముచేసివచ్చి, వీధిలో నిలుచుండి సీత వైద్యునిరాక కెదురుచూచుచుండెను. ఇంతలో నొకపరిచారిక వీధిలో నుండి రొఁజుచుఁబరుగెత్తుకొనివచ్చి, సీతనుజూచి "అమ్మా! నీమగఁడును భృత్యుఁడును కావలియున్నవారి కన్నులుగప్పి తప్పించుకొని దొడ్డిత్రోవను పాఱిపోయినారు కాఁబోలును! ఆవలి వీధినిబడి యిప్పుడే యిద్దఱును స్వేచ్ఛముగాపోవుచున్నార''ని వర్తమానముచెప్పెను. ఆమాటలు విన్నతోడనే కొంతమంది సేవకులను వెంటఁబెట్టుకొని, మగనిని మరలఁ బట్టుకొని తీసికొనివచ్చుటకయి పరిచారిక చూపినమార్గమున సీత పరుగెత్తిపోయెను. ఆమెచెల్లెలుకూడ ఆగుంపుతో నప్పగారిని వెంబడించెను. వారు సమీపముననున్న యొక మఠము చేరువకు వెళ్ళునప్పటికి, చిన్నవసంతకుఁడును లక్ష్మణుఁడును తలవంచుకొని నడుచుచు అచ్చటఁ గనఁబడిరి. ఆకారలక్షణాదులచేత భేదమేమియు లేక యొక్కపోలికగా

నుండుటచేత సీత వారినిజూచి, తనభర్తయు భృత్యుఁడునని మరల భ్రమ గొనెను.

చిన్నవసంతకుఁ డింకను మనస్సు కలఁతనొందియే యుండెను. కంసలవాఁ డిచ్చిపోయిన చంద్రహారము చేతిలోనే యుండెను. సొమ్ము ముట్టినమీఁదట ధర్మాధికారులచే విడిచిపెట్టఁబడి, అప్పు డాకంసలవాఁ డామార్గముననే యింటికిఁబోవుచు, వసంతకునిజూచి 'కూలి యియ్య వలసివచ్చునని చంద్రహారమును నీకియ్యనేలేదంటివే' యిదేకదా నీ మర్యాద' యని నిష్ఠురములాడ మొదలుపెట్టెను. 'ఈదినము మధ్యాహ్న వేళ నాదారిని నేను జనుచుండఁగా నీయింతట నీవేవచ్చి చంద్రహారమును వద్దనుచుండఁగా నామీఁదఁ బాఱవైచిపోతివి; అప్పటినుండియు మరల నీ మొగమయిన నేనుచూచినానా?' అని వసంతకుఁడు పలుకుచుండెను.

ఈసమయమున సీత యక్కడకువచ్చి, కావలినుండి తప్పించుకొని వీధిఁబడిన తనభర్తదొరకెరండనికూడవచ్చినవారినిబిలిచెను. అంతవారం దఱును గూడుకొని యఱచుచు, అతనిని త్రాళ్ళతోఁగట్టి కొనిపోవుట కయి మీఁదిమీఁదికివచ్చి బలవంతముగా మీఁద చేతులువేయఁజూచిరి. అదిచూచి భయాక్రాంతులై వసంతకుఁడును భృత్యుఁడును ఒక్క గంతునఁబోయి మఠములోఁబడి ప్రాణములు దక్కించుకొని, యందున్న యోగినిని శరణు చొచ్చిరి.

ఆయోగిని వారికభయమిచ్చి జడుపుదీర్చి, తానీవలికివచ్చి యీ సంక్షోభమునకు హేతువేమని యడిగెను. ఆమె గాంభీర్యవతియు పూజ నీయయు నగుటయేకాక తానుజూచిన సంగతులయొక్క వాస్తవమును సూక్ష్మదృష్టితో కనిపెట్టి న్యాయమును తీర్చుటయందుఁగూడ సమర్థు రాలుగనుక, మూలమంతయుఁగనుఁగొనకతన్నాప్రకారముగా మఱుఁగు చొచ్చినవారిని సులభముగా నితరులకొప్పగింప నిచ్ఛలేనిదాయెను.

కాఁబట్టిసీతతనమగనికి పిచ్చిరెత్తి యీప్రకారముగా వచ్చినాఁడనిచెప్పి నంతతోఁ దృప్తినొందక, "నీమగనికింతయాకస్మికముగ వెఱ్ఱియెత్తుటకు కారణమేమి? లోకులియ్యవలసినఋణములుగానియితరులయొద్ద దాఁచు కొన్న సొమ్ముగాని మునిఁగిపోయినదా? ప్రాణసమానుఁడగు మిత్రుఁడెవ్వఁ డైనఁ బరలోకప్రాప్తుఁడైనాఁడా?" అని గట్టిగా విచారణచేయ నారం భించెను. ఇటువంటి వేమియు జరగియుండలేదని సీత ప్రత్యుత్తరమిచ్చెను. అప్పుడు కొంతయాలోచించి యాయోగిని "నిన్నుమాని నీభర్తమఱి యొకమానిని మీఁద మనసు తగిలియున్నాఁడేమో, అది కారణ మయి యుండవచ్చున'ని పలికెను. "ఆయన పూర్వము తఱుచుగా నింటికిరాక మసలుచువచ్చుట మఱియొక యింతిమీఁది మోహముచేతనే యని నేననుకొనుచుంటిని. ఇప్పుడింటికి రాకుండుట యన్యకాంతమీఁది మమత చేతఁగాదు; సంగతియెఱిఁగి యింటికడ నేనేమైన ననుకొందునేమో యనుభీతిచేత నిప్పుడురాకమానుచున్నాఁడు" అని సీతబదులుచెప్పెను. ఆమాటలువిని యింటికడ నిత్యమును నీవుపెట్టు బాధచేతనే యీతని మనస్సువికలతనొందెఁగాఁబోలుననిసందేహపడి, నిజమును దెలిసికోవలె నను నుద్దేశముతో "అట్టిపని నాతఁడు చేసినప్పుడు నీవుగట్టిగా న్యాయ నిష్ఠురములాడిమందలింపవలసి యుండె'నని యోగినిపలికెను. "నేనుమాత్ర మూరకున్నానా? చేతనైనంతవఱకు మందలించుచునేయున్నా'నని సీత చెప్పెను "అయినను నీవు తగినంత కూకలు వేసియున్నట్లు తోఁచద'ని యోగిని యూరకుండెను. అప్పుడు సీత తానావిషయమునయి పడిన శ్రమమునుగుఱించియామెకుగట్టినమ్మకమునుబుట్టింపవలెనను నుద్దేశము తో నామె మొగమువంకఁజూచి, నిజముచెప్పెదను వినుమని యిట్లనియె: "నాకును భర్తకు నిఁక రాత్రింబగలు రెండవ ప్రసంగములేదు. రాత్రిపరు న్నప్పుడు నిద్రపట్టినదాఁక చెవి దగ్గఱఁజేరి యీసంగతినే గొణుగుచుం దును. భోజనముచేయునప్పుడుసహిత మీవిషయమయి వినకుండ ముద్ద

త్రిమింగనియ్యను. మేమిద్దఱమును గలిసికొన్నప్పు డెప్పుడును మఱియొక సంగతి మాటాడను. అతఁడు పదిమందిలో నున్నప్పుడు సహితము మాటల ధోరణిని మఱియొకసంగతి తెచ్చి యతనిమనసునకు నాఁటు నట్టుగా ఎత్తిపొడుపుమాటల నాడుచుందును. ఇట్లు ప్రతినిమిషమును తలవాచునట్లు చీవాట్లుపెట్టుచున్నను, అతఁడు తనబుద్ధి మానకున్నాఁడ'ని యున్నగుట్టు రవంతను బయలఁబెట్టెను

ఈప్రకారమామెయోగిని యుక్తిచేసి యాసంగతియంతయు నామె నోటనె పలికించి, 'నీవాడెడు మాటలమూలముననే నీమగనికిపిచ్చియెత్తి నది, సందేహములేదు. అహోరాత్రములు చెవిచెంతఁజేరి సాధించు చుండు భార్యపలుకులు వెఱ్ఱికుక్కకఱచినంతకంటెను విషమయి యెంత పరమశాంతునకును నిమిషములో పిచ్చియెత్తించును. నీపోరుచేత నతఁడు రాత్రులు నిద్రకు మొగము వాచిపోయినట్టు తోఁచుచున్నది. కలఁతనిద్ర పోయినవానికి మతిచలించిపోయినదన్న నంతయాశ్చర్యము కాదు. నీ వాడుమాటలతో తిన్నయన్నము కడుపునఁబట్టక నీరయిపో యియుండును. ఈప్రకారముగా నిద్రాహారములులేక దేహసౌఖ్యము లకు వెలియయి, యిల్లొక యడవిగానున్నవాని కేరోగములును ఏల రాకపోవును? ఇదియంతయు నీవు చేసికొన్న దోషఫలమే యనుటకు సందేహములేదు. స్వయంకృతాపరాధముగదాయని నీదినీవే యనుభ వింపవలెను.' అని చీవాట్లుపెట్ట నారంభించెను.

అప్పుడప్పుమీఁదియభిమానముచేత సుభద్ర కలిపించుకొని మా యప్ప మంచిమాటలతోనే భర్తనుబోధించుచు వచ్చినదనిచెప్పవచ్చి, మరలనప్పవంక తిరిగి 'ఆమెయట్లు తప్పిదమునెల్ల నీపయినెమోపి తూల నాడుచుండఁగా మాఱుమా టాడక యూరకుండెదవేమ'ని, మెల్లఁగా నడిగెను. 'ఆమె చమత్కారముగా నిజమును బయలఁదీసి, నన్ను నోరె త్తకుండునట్లుచేసినది. నేనేమిచెప్పఁగలుగుదు'నని సీతపలికిమిన్నకుండెను.

సీత తనప్రవర్తనమునకు సిగ్గుపడినదయినను, తనమగనిని తన కొప్పగింత పెట్టుమని మూర్ఖత్వముతో నామెను బలాత్కరించుట మాత్రము మానినదికాదు. ఆయోగిని యాతని నటువంటి భార్యావశమున వదలిపెట్ట నిష్టములేనిదై, మంచిమాటలతో నాతని స్వస్థచిత్తునిఁ జేయఁదలఁచి యెవ్వరిని లోనికి రానియ్యక లోపలికిఁబోయి తలుపు వేసికొనెను.

ఇద్దఱు సహోదరులును సరిగా నొకరినొకరు పోలియుండుటచేత నింతలేసి వింతలుపుట్టిన యాదినమునందే వర్ధమానునియొక్క యవసానకాలము సమీపించుచున్నట్లు కనఁబడెను. ఇప్పుడించుమించుగా సూర్యాస్తమానసమయము కావచ్చినదిగనుక, ఆతఁడు ధనము నియ్యలేకపోయినపక్షమున ప్రొద్దుగ్రుంకువేళఁ బ్రాణములు నివ్వవలసియుండెను. అతనిని వధచేయుస్థలము మఠమునకు సమీపముగానే యున్నందున, ఆయోగిని లోపలికిఁబోయి తలుపు బిగించుకొన్న సమయమున రాజభటులు వెంబడిని వర్ధమానుఁడక్కడకు వచ్చెను. ఆపట్టణమున ధనమిచ్చి యాతని ప్రాణములు కాపాడఁగల ధర్మాత్ము లెవ్వరైన బయలుదేఱి యుహామస్తీయుని నిలుతురేని తత్క్షణ మావర్తకుని విడిచి పెట్టింపవలెనను నభిప్రాయముతో రాజును వారివెంబడినె వచ్చుచుండెను. తాను స్వయముగానుండి ప్రభువీప్రకార మతనిని గొనిపోవుచుండఁగా, సీత యేడ్చుచుఁబోయి, యొకయోగిని తనమగనిని లోపలదాఁచి వదలిపెట్టకున్నదనియు, పిచ్చియెత్తిన తనపెనిమిటిని దనకిప్పించి న్యాయము దయచేయుఁడనియు వేఁడుకొనుచు, రాజును పరివారముతో నాపెను. ఆమె యాప్రకారముగా తన మొఱ్ఱను విన్నవించుకొనుచుండఁగా ఆమె నిజముయినభర్త భృత్యునితోడఁగూడ కట్లువిడిపించుకొనివచ్చి తనభార్యయుక్రమముగా తేనిదేతనకు పిచ్చియెత్తినదని ముషపెట్టి పరిచారకులచేత తన్నుఁగట్టించి చీఁకటిగదిలోఁ ద్రోయించి తలుపువేయుంచినదనియు,

తానెట్లో కట్లు త్రెంచుకొని కావలివారిని దుద్దువెట్టి చెఱలోనుండి యూడిపడితి ననియు, మొఱ్ఱపెట్టుకొనెను. తన కీనిమిటి మఠములోనే యున్నాఁడని తలఁచియున్నందున సీత యాతనిని జూచినతోడనె నిశ్చేష్టితురాలయి మాటరాక నిలువఁబడియుండెను.

వర్ధమానుఁడు తనకొమారునిజూచి, తల్లినిసోదరుని వెదకుటకయి బయలుదేఱిన కుమారుఁడీతఁడే యనుకొని, 'నే నియ్యవలసినసొమ్మిచ్చి యితఁడు ప్రాణములు కాపాడును నాకిఁక భయములే'దని తలఁచుకొనెను. కాఁబట్టి పుత్రవాత్సల్యముతో 'నాయనా!' యని కొడుకునుపిలిచి, తన్ను విడిపించువిషయమై ప్రశంసించెను. కానివర్ధమానుఁడద్భుతపడునట్లు వసంతకుఁడు నీవెవ్వఁడవో నేనెఱుఁగనని స్పష్టముగాఁ దెలియఁజెప్పెను. ఈవసంతకుఁడు తనచిన్నతనములో గాలివానపట్టి యొకరినొకరు ఎడఁబాసినది మొదలుకొని తండ్రినెప్పుడును జూచియుండలేదు. తా ననుభవించిన దుఃఖములచేతను వార్ధకముచేతను రూపముబొత్తిగా మాఱినందున తన్ను గుఱుతుపట్టలేకపోయినాఁడో, యిటువంటి దుర్దశలోనున్న తన్ను తండ్రియని యొప్పుకొనుట యవమానకరమని తలఁచి చెప్పసిగ్గుపడుచున్నాఁడోయని యనుమానించి కొమారునకుఁ దన్నెఱిఁగించుటకయి వర్ధమానుఁడు బహువిధముల ప్రయత్నించిచూచెనుగాని యాతని ప్రయత్నములేవియు ప్రయోజనకారులయినవికావు. ఈప్రకార మందఱును త్రొక్కటపడుచుండఁగా, రాజుగా రెవ్వరినో శిరశ్ఛేదముచేయించుటకయి స్వయముగానుండి తీసికొనిపోవుచున్నారు చూతము రండని యొండొరులఁ బిలుచుకొనుపౌరులకలకలములు విని, ఆయోగినియు వసంతకుఁడును భృత్యుఁడును లోపలినుండి వెలుపలికి వచ్చిరి. అప్పుడు సీత తనయెదుట నిద్దఱుభర్తలును ఇద్దఱుభృత్యులును నిలుచుండఁగాఁ జూచి, యత్యద్భుతపడి చిత్రపుప్రతిమవలె నోరు కదలుపక నిలుచుండెను.

ఇంతవఱకును వారినందఱిని కలఁతపడునట్లు చేయుచున్న భ్రమ

ప్రమాదములిప్పుడు బయలుపడినవి. ఇద్దఱువసంతకులును ఇద్దఱు లక్ష్మణులును ఈఁగకాలంతయు భేదములేక యొకయచ్చున గుద్దినట్లుగా నుండుటచూచి, ప్రొద్దునవిన్నకథ మనస్సునకుఁ గట్టియున్నట్లున్నదిగనుక వాస్తవము నొక్కనిమిషములో నూహించి, రాజు వారు వర్ధమానుని యొక్క కొమాళ్ళును సేవకులును అని తెలిసికొనెను.

అప్పుడెవ్వరు నెదురుచూడనిమఱియొకసంతోషకార్యముగూడఁ దటస్థమయి, వర్ధమానునికథను మఱింత యనుకూలముగా సంపూర్తిచేసినది. నాఁటి యుదయకాలమున మహావిచారములోను మరణదండనవలని భయములోను నారంభింపఁబడి చెప్పఁబడినకథ, సూర్యాస్తమానమునకు ముందే సంతోషములో ముగిసినందున, ఎల్లవారును పరమానందభరితులయిరి. మఠములోనున్న యోగిని వర్ధమానునిభార్యయు, వసంతకులతల్లియునగు చారుమతియనికూడఁ దెలియవచ్చెను. నాఁడు చేపలవాండ్రు పెద్దవసంతకుని, తల్లిని, లక్ష్మణుని పయికిఁదీసినప్పుడు, పిల్లల నిద్దఱను గొనిపోయి మఱియొకచోట విక్రయించుకొనిరి. చారుమతి పుత్రశోకమునకుఁ బతివిరహము తోడ్పడ నిర్వేదించుచు, పుణ్యవ్రతముల నాచరించుచు యోగినియై యందందుఁదిరిగి తుదకీమఠమునఁ బ్రవేశించి శక్తి కొలఁదినిబీదసాదలనాదరించుచు,తన్నెఱిఁగినవారందఱివలననుగౌరవము పొందుచుండెను. చిరకాలమునుండి యన్యోన్యవీక్షణములేకయున్న జననీజనకులును బిడ్డలును అందఱును తలఁపనితలఁపుగా నొక్కసారి యేకస్థలమున సమావేశమయినందున, మహాసంతోషములోనుండి యాకౌఁగిలింతలలోను ప్రియవాక్యములలోను వర్ధమానుఁడు మరణదండనకు లోఁబడియున్నాఁ డన్నమాటనే మఱచిపోయిరి. ఆసంతోషోద్రేకము కొంత శాంతించినతరువాతఁ దెలిసి, పెద్దవసంతకుఁడు ఆసొమ్మునంతను తానిచ్చెదనని బయలు దేఱెను. కాని రాజు సొమ్మువుచ్చుకొనకయే యాతనిని మన్నించి విడిచి పెట్టెను. చిరవిరహమునొంది కడకు సుఖముగాఁ

గూడుకొన్న దంపతులును పుత్రులును తమరుపడినకష్టములను గూర్చి యేమి మాటాడుకొందురో వినవలెనని రాజు, ఆయోగినితోను దీర్ఘకాల మునకుఁ గలిసికొన్నయామె నాథునితోను సుతులతోను గలిసి మఠము నకుఁబోయెను. ఈపరాకున మన మాయిద్దఱులక్ష్మణుల సంతోషమును గూడ నిచ్చటఁజెప్ప మఱవఁగూడదు. వాండ్రును భ్రాతృస్నేహమున నొకరినొకరు కౌఁగిలించుకొని, ప్రియాలాపములతో సల్లాపసౌఖ్యము ననుభవింపుచు, అపరిమితానందమును బొందిరి.

సీతయు అత్తగారి హితబోధవల్ల బుద్ధితెచ్చుకొని, అటుపయి నెప్పుడును మగనిమీఁద లేనిపోని యనుమానమును పడక నిరంతరము నాతని మాటలలో మెలఁగుచు పూవులో తావివలెఁ గలసి మెలసియుండి నిరుపమానమైన సౌఖ్య మనుభవించుచుండెను.

చిన్నవసంతకుఁడు తనమఱదలైన సుభద్రను వివాహము చేసికొని, యీమెవలన నమితసుఖములనుగాంచుచుండెను. వృద్ధుఁడైనయా వర్ధమానుఁడును కొడుకులతోను కోడండ్రతోను బహు సంవత్సరములు కాంచీపురముననేయుండి సంతోషముతోఁ గాలమును బుచ్చుచుండెను.

పయినిచెప్పిన విచిత్రములు వారందఱును గలిసికొన్నంత మాత్రమున ముగిసినవికావు. తల్లిదండ్రులు ఒకకొడుకును మఱియొక కొడుకును గాను, వసంతకు లొక భృత్యుని మఱియొక భృత్యునిగాను, లక్ష్మణు లొకరియజమాను నొకరియజమానునిగాను, భార్య లొకరిమగని మఱి యొకరి మగనిగాను, పౌరు లొకవసంతకుని మఱియొకవసంతకునిగాను, భ్రమించుచుండఁ బట్టణమున నిత్యమును వలయునంత వినోదము కలిగి యుండెను.

సంపూర్ణము.



## ఇందువచ్చు పాత్రములు.

చంద్రకేతుఁడు—కోసలదేశపురాజు.

వీరసేనుఁడు—చంద్రకేతునకు లోఁబడిన లక్ష్మణపురసంస్థానాధీశుఁడు.

విక్రమసేనుఁడు—వీరసేనుని కుమారుఁడు; సతీమణిభర్త.

సౌజన్యనిధి—చంద్రకేతుని మంత్రులలో నొకఁడు.

ధన్వంతరి—సతీమణితండ్రి; ఘనవైద్యుఁడు.

సునంద—వీరసేనుని రాణి; విక్రమసేనుని తల్లి.

సతీమణి—ధన్వంతరి కూఁతురు; విక్రమసేనునిభార్య.

గుణవతి—చందనావతి కూఁతురు.

చందనావతి—కాశీ నివాసురాలయిన గుణవతితల్లి.

# సతీమణీవిజయము.

పూర్వకాలమునందు కోసలదేశమును తనకయోధ్యాపురము రాజధానిగా సూర్యవంశపురాజయిన చంద్రకేతుఁడు పాలించుచుండెను. ఆతనిపాలనమునకులోఁబడి యనేకసంస్థానాధిపతులాతనికి కప్పము కట్టుచు సేవించుచుండిరి ఆసామంతరాజులలో లక్ష్మణపురసంస్థానాధీశ్వరుఁడయిన వీరసేనుఁ డొకఁడు. అతఁ డాకస్మికముగా మృతినొందినందున, తత్పుత్రుఁడయిన విక్రమసేనుఁడుచిన్నతనములోనే రాజ్యమునకువచ్చెను, చంద్రకేతునకు వీరసేనునియందు మిక్కిలి ప్రేమగనుక, ఆతని మరణవార్తను విన్నప్పుడు మిక్కిలిదుఃఖించి యాతనిపుత్రుని విద్యాబుద్ధులు చెప్పించి బాగుచేయవలెననెడి యుద్దేశముతో వెంటనే తనరాజధానికి రమ్మని విక్రమసేనుని కాజ్ఞపంపెను. విక్రమసేనుఁడు భర్తృమరణదుఃఖితయైయున్న తల్లియొద్ద కూరుచుండియుండఁగా సౌజన్యనిధియను నాతఁడు రాజాజ్ఞను పట్టుకొని యయోధ్యానగరమునుండి వచ్చెను. కోసలదేశపురాజు లాకాలమునందు నిరంకుశప్రభువులయినందున వారి యాజ్ఞోల్లంఘనము చేయుట ప్రాణాపాయకరమని యెఱిఁగినదయి సాధ్వీమణియైన యాసుకంద పుత్రునియం దెంతప్రేమగలదయినను రాజాజ్ఞను మీఱ సాహసింపక పుత్రవియోగము సహింపలేక నాటిదినము తనభర్త మరల మృతుఁడయినట్లు దుఃఖించుచు వెంటనే కొమారు నాతనివెంటఁ బోమ్మని యుత్తరువుచేసెను అప్పుడు సౌజన్యనిధి మంచిమాటలతో నామెకు కొంతదుఃఖోపశమనము చేసి, పుత్రవియోగమునకు శోకింపకుండ బుద్ధిచెప్పి, చంద్రకేతుఁడు దయార్ద్రహృదయుఁడనియు, విక్రమసేనునకు తండ్రిలేనిలోపము లేకుండ నతఁడు పితృప్రతినిధియై పితృవాత్సల్యముతో సర్వవిధముల కాపాడుననియు, రాజొక యసాధ్యవ్యాధిచేత

బాధపడుచున్నందున తండ్రియెడలఁ గలిగియుండిన స్నేహభావముమునుబట్టి యిప్పుడీవిక్రమసేనుని పిలిపింపవలసివచ్చెననియు, చెప్పి యామెనోదార్చెను. అప్పుడామె రాజునకసాధ్యవ్యాధి కలిగినందునకయి వ్యసనపడి, తనచెంతనున్న సతీమణియను చిన్నదానినాతనికి చేతితోఁజూపి, ఈచిన్నదానితండ్రియే యిప్పుడు జీవించియుండినపక్షమున రాజుయొక్క వ్యాధిని తప్పకకుదుర్చుననిచెప్పి, ఈచిన్నది ఘనవైద్యుఁడని జగత్ప్రసిద్ధి కెక్కిన ధన్వంతరి కూఁతురనియు, అతఁడు తనయవసానకాలమునందు తల్లిలేని బిడ్డయైన యీసతీమణిని తనకప్పగించినందున నాటినుండియు తానీ చిన్నదానిని పుత్రికాప్రేమతో పెంచుచుంటిననియు, తల్లిదండ్రుల సుగుణములు పట్టుపడుటచేత బహుబుద్ధిమంతురాలయి యీచిన్నది యెల్ల వారిచేతను మంచిదనిపించుకొనుచున్నదనియు' సతీమణియొక్క చరిత్రమును కొంత మాటధోరణిని చెప్పెను. ఆమె యామాటలు చెప్పుచున్నంతసేపును సతీమణి తలవంచుకొని నిలుచుండి కన్నుల నీరు పెట్టుకొనుచుండెను. అదిచూచి సునంద పోయినవారినిమిత్తమయి యదే పనిగా దుఃఖించుట మంచిదికాదనిచెప్పి యాచిన్నదాని నూరడించెను.

అప్పుడు విక్రమసేనుఁడు తల్లినిజూచి తనప్రయాణమునకు సెలవు వేడఁగా, ఆమెకుమారుని బహువిధములదీవించి కన్నులనీరు కాలువలు కట్ట ప్రేమాస్పదుఁడైన యాచిన్నవానిని సౌజన్యనిధికొప్పగించి "నాయనా! ఈచిన్నవాఁడీవఱకెన్నఁడును తల్లిదండ్రులనువిడిచి పరులయొద్ద నొంటిగా మెలఁగినవాఁడుకాఁడు. లోకవ్యవహారమెఱుఁగని యీబాలకుని కెట్లుబుద్ధిచెప్పి మంచివానినిగా దిద్దుకొందురో మీదేభారము" అని చెప్పి వెళ్ళుటకు సెలవిచ్చెను. ఆచిన్నవాఁడు వెళ్ళునప్పుడు సతీమణినిజూచి, "నిన్నుపుత్రికాప్రేమతోఁ జూచుచుండెడు మాతల్లిగారిసంరక్షణము నెప్పుడును నీవేమఱక నేను దగ్గఱలేనిలోపము కనఁబడకుండఁ జేయుము" అని చెప్పి తల్లి నప్పగించెను.

సతీమణి చిరకాలమునుండి మనసులో విక్రమసేనుని కామించి యుండెను. ఇంతకుముం దాచిన్నది తలవంచుకొని యేడ్చినది విక్రమసేనుఁడు తన్నువిడిచిపోవునని యేకాని తండ్రినిమిత్తముకాదు. ఆమె తండ్రి యందు మిక్కిలి ప్రేమకలదేయయినను, విక్రమసేనునియం దామెకుఁ గల ప్రేమయంతకంటె నధికమయినది. తనకుఁ బ్రేమాస్పదుఁడయి కన్నుల యెదుటఁ గానఁబడుచున్న యతఁడు తన్నుఁ బాసి శీఘ్రముగానే వెడలి పోవనున్నాఁడనితలఁచుకొనుటవలనఁగలిగినయీ పెద్దదుఃఖములో, ఎప్పుడో మరణమునొంది రూపామలుసహితము తిన్నగాస్ఫురణకురాకసగము మఱచియున్న యాతండ్రివిషయమైన దుఃఖముతోచక యడఁగిపోయెను.

సతీమణికి చిరకాలమునుండి విక్రమసేనునిమీఁద ననురాగము కలదుకాని యామె తాను బీదకుటుంబమున పుట్టినదాననవియు, అతఁడు మహావంశమునఁబుట్టి కిరీటాధిపత్యమున కర్హమయినవాఁడనియు, మాత్రము మనసులో నెప్పుడును మఱచియుండినదికాదు. ఆమెతనపూర్వులు సుప్రసిద్ధులు కాకుండుటయు నాతనిపూర్వులందఱును రాజ్యభారధూర్వహులయి యుండుటయుఁ దలపోసి, ఆతనికిని తనకునుగల యంతరమును విచారించి నిరాశచేసికొని, ఆకాశమునందున్న చంద్రునిఁ గామించుట యెంతప్రయోజనకరమో తా నాతని కామించుటయు నంతే ప్రయోజనకరమని భావించి నిట్టూర్పువిడుచుచు, భార్యగాఁ గాకపోయినను సేవకురాలుగానయినను యాతనిసేవయందే తనదినములు గడపవలెనని నిశ్చయించుకొనెను. అతఁడుతనకుభర్తయగునన్నయాశయామె మనస్సులో లేకపోయినను, నవ్వుమొగముతోను తుమ్మెదలను మించిన కురులతోను తేనియ లొలుకు మాటలతోను సదా యతఁడు కన్నుల యెదుర మెలఁగుచుండుటచేత నామెకొకవిధమయిన యానందము కలుగుచుండెను. అందుచేత నిప్పుడాతని విగ్రహమామెమనస్సున పొడకట్టి యామెహృదయమును దుఃఖసముద్రములో ముంచివేయఁజొచ్చెను.

ధన్వంతరి యమోఘములైనకొన్ని దివ్యౌషధములనుదప్ప మరణకాలమునందుఁ దనకొమారితకు మఱేదియు సొత్తిచ్చిపోలేదు. ఆ యౌషధములలో నొకటి కోసల దేశపురాజయిన చంద్రకేతుఁడు బాధపడుచున్న దీర్ఘరోగమునకమోఘమయినమందు. సౌజన్యనిధిసునందతో రాజురోగమునుగూర్చి చెప్పినప్పుడు తనప్రియుఁడు పోఁబోవుచున్న యయోధ్యానగరమునకు తానుగూడపోయి రాజునకు చికిత్సచేసి రోగనివారణను చేయుటవలన లాభముపొందవలయునన్నయూహ సతీమణి యొక్క హృదయమునం దంకురించెను. అయినను రాజవైద్యులందఱును రాజుయొక్కవ్యాధి యసాధ్యమయినదని నిష్కర్షించినతరువాత లేఁతవయస్సులోనున్న యొక్కసుందరి పోయి తానావ్యాధిని నిర్మూలింపఁజేసెదనని చెప్పినపక్షమునఁ, తనయొద్దనున్న యౌషధమహిమ యెట్టిదయినను రాజును పదాస్థానవైద్యులును నమ్మిపనిచేయనిత్తురాయన్న సంశయము మాత్ర మామెమనస్సును బాధించుచుండెను. కానియామెయంతటితో నిరుత్సాహురాలుకాలేదు. ఆమెకాయౌషధమునందున్న దృఢవిశ్వాసమునుబట్టి తన్నురాజునకు చికిత్సచేయ నంగీకరించిన పక్షమున నతఁడు తప్పక స్వస్థతను పొందుననియు అందువలనఁ దనయదృష్టముపండి తనకు విక్రమసేనుని రాణికాఁగలభాగ్యము పట్టినను పట్టవచ్చుననియు, నమ్మి తానేలాగుననయిన నయోధ్యకుఁబోవలెననినిశ్చయముచేసికొనియుండెను.

ఇట్లుండఁగా విక్రమసేనుఁ డయోధ్యకుఁబోయిన కొంతకాలమునకు దాసియొకతె సునందయొద్దకువచ్చి సతీమణితనలోతానుమాటాడుకొనుచుండఁగా పొంచుండి వింటిననియు, ఆమాటలవలన నాచిన్నది విక్రమసేనుని కామించియున్నట్టును తానాతని నిమిత్తమయి యయోధ్యకు పోఁదలఁచియున్నట్టును తనకర్థమయ్యెననియు, ఆమెతోఁజెప్పెను. ఆమాటలువిని యామెయప్పుడేమియుననక సతీమణినిదనతోనొక్కసారి మాటాడిపొమ్మని చెప్పుమనిమాత్రము దాసితోచెప్పి దానినిపంపివేసెను.

ఇట్లు దాసినిపంపివేసి యొంటిగానుండి సతీమణిసంగతిని దలఁచుకొన్నప్పు డామెకు తానుపడుచుతనములో వీరసేనునికామించిన నాటిచర్యలు స్మరణకువచ్చి యౌవనదశలో తాను నట్టియవస్థనే పడితిననియు, కేతకీకుసుమమును కంటకములంటియుండునట్లుగా యౌవనదశను కామపీడయాశ్రయించియుండుట నైసర్గికమనియు, అది యప్పుడు దోషముగాఁదోచక పోయినను మానవదేహమును ధరించినవారికెల్ల నీదోషముండునదియే యనియు, తలపోయుచుండెను ఈప్రకారముగా నాలోచించుకొనుచున్న సమయములో సతీమణి యామెవద్దకువచ్చెను ఆచిన్నదికనఁబడఁగానే సునంద "సతీమణీ! నేనునీకు తల్లినని నీవెఱుఁగుదువుగదా" అనెను. అనఁగానే వెలవెలపోయి సతీమణి "అమ్మా! నీవునాయజమానురాలవు" అని యూరకుండెను. "నీవునాకూఁతురవు. నేను నీకుతల్లిని. నామాటల కులికిపడి ఆలాగుననావంక తెల్లపోయిచూచుచున్నావేమి!" అనియామె 'తల్లి' యన్నమాట రెట్టించిపలికెను. అందుమీఁద సతీమణి తానువిక్రమసేనుని కామించినమాట సునంద గ్రహించినదేమోయని భయపడి, మనస్సు తొందరపడ చూపులు చంచలింప "అమ్మా! నన్ను క్షమింపుము. మీరునాకుతల్లియు కానేరరు; మీకునేను కూఁతురనుకానేరను. లక్ష్మణపురాధీశ్వరుఁడు నాకెట్లు సోదరుఁడగుట సంభవించును?" అనియా చిన్నదిమాటతడఁబడపలికెను. 'కూఁతురవు కాకపోయిన నీవునాకు కోడలవుకావచ్చును. కూఁతురు, తల్లి, అన్నమాటలు నీమనస్సున కింపుగా నుండకపోవుటనుబట్టిచూడఁగా కోడలవనియే నీయభిప్రాయ మనుకొనెదను. ఓసతీమణీ! నాకుమారునిమీఁద నీకు ప్రేమగలదా!" అనియామె యడిగెను. అడిగినమాటకుత్తరము చెప్పక సతీమణి "అమ్మా! నాతప్పు క్షమింపుఁడు" అని భయముతో పలికెను. సునందయు నంతతో నూరకుండక "ఓసతీమణీ! నాకుమారునిమీఁద నీకుప్రేమగలదా?" అనియడిగిన ప్రశ్ననే మరలనడిగెను. "అతనిమీఁద మీకు ప్రేమలేదా!" అని

ప్రశ్న వేసి యాచిన్నది యడిగినమాట కుత్తరము చెప్పక తప్పించుకొనుట కయి ప్రయత్నించెనుగాని సునంద యంతటితో విడిచిపెట్టక “సతీమణీ! నాముందఱ నీగుట్టు దాచుటకయి ప్రయత్నింపక నీమనస్సులో నున్నది చెప్పివేయుము. నీనోరు చెప్పక పోయినను నీచేష్టలునీకుఁ గలవలపును బట్టబయలు చేయుచున్నవి” అని స్పష్టముగా చెప్పివేసెను. అందుపయిని సతీమణి యామెపాదములమీఁదఁబడి తనమనస్సాంతనినితగులుటయొప్పుకొని, ముఖమున లజ్జాభయములుతోఁప వినయపూర్వకముగా క్షమింప వేఁడుకొని, ధనవ్యత్యాసమునుబట్టి విక్రమసేనుని వరించుటకు తనకుఁగల యనర్హతను దెలుపుటయేకాక తాను కామించియున్నసంగతి యాతనికి తెలియదన్నమాటకూడ చెప్పివేసెను. అప్పుడు సునంద “నీవీమధ్య నయోధ్యాపురమునకుఁ బోవనుద్దేశించుకోలేదా?” అనియాచిన్నదాని నడిగెను. సౌజన్యనిధి రాజుయొక్క రుగ్ణతను జెప్పినప్పుడు తనమనస్సులో నట్టియుద్దేశముపుట్టినమాట వాస్తవమేయని సతీమణియొప్పుకొనెను. “అయోధ్యాపురమునకు నీవు పోఁదలఁచుకొన్న దందుకొఱకా? ఓసతీమణీ! నీవునాతో నిజము చెప్పుము.” అని యామె యాచిన్నదానిని నిర్బంధముగానడిగెను. అడుగఁగానే సతీమణి “అమ్మా! నాకయోధ్యాపురయాత్రావిషయమయినబుద్ధిపుట్టుటకయిమీకుమారుఁడేకారణము. అతఁడే నాహృదయపీఠమునందు నిలిచియుండక పోయిన పక్షమున, అయోధ్యపేరును మందుపేరును రాజుపేరును నేను తలపెట్టకపోయియే యుందును.” అని యున్నదియున్నట్టు ధారాళముగాఁ జెప్పివేసెను. తనయిష్టమునుగాని యనిష్టమునుగాని తెలుపక సునందయాచిన్నదిచెప్పినదంతయువిని, కడపట “నీకాయౌషధమహిమయం దంతనమ్మకమున్నదా?” యనిమాత్రమడిగెను. అప్పుడు సతీమణి యాదివ్యౌషధము తనతండ్రియొద్దనున్న మహౌషధములలో నెల్ల నుత్తమోత్తమమైనదనియు, అది యతఁడు చిరకాలము మహాత్ముల నాశ్రయించియు స్వానుభవము

నుపయోగించియు కష్టపడిసంపాదించిన సిద్ధౌషధమగుటచేత దానియోగము నెవ్వరికినిఁజెప్పక మరణకాలమునందు ప్రాణాధికురాలయిన తనకు రహస్యముగా నుపదేశించెననియు, ఆమెకు నమ్మకము పుట్టునట్లుగాఁ జెప్పెను. ఆమాటలు విన్నపిమ్మట సునంద కొంచెముసేపాలోచించి ధన్వంతరియొక్క మరణసమయమునందు తానాతని కొమారితయొక్క యోగక్షేమములవిషయమయిసాధ్యమయినంతశ్రద్ధవహించెదననివాగ్దానము చేసి యుండుట తలఁచుకొని రాజుయొక్క క్షేమమునుగూడముఖ్యముగాఁ గోరియున్నదిగాన సతీమణియొక్క ప్రయత్నమునకు ప్రతిబంధములు కల్పింపక, అయోధ్యకుపోయి యథేచ్ఛముగా పనిచేయుటకయి యాచిన్నదానికి సెలవిచ్చి ప్రయాణమునకు వలయుధనమును తగిన పరివారమునుగూడ సమకూర్చెను. అందుకు సతీమణి పరమానందభరితురాలయి యామెకు నమస్కారములుచేసి యామెచే ననేకాశీర్వచనములనుపొంది, రాజున కారోగ్యమునుగలిగించి యభీష్టఫలసిద్ధిని పొందుమని యామెవలన కడపటిదీవనను బడసి, అయోధ్యకుఁ బోవుటకు బయలుదేఱెను.

సతీమణి కొన్నిదినములలో సుఖముగా నయోధ్యచేరి, సౌజన్యనిధియొక్క సాహాయ్యముచేత శీఘ్రకాలములో రాజసందర్శనము చేయఁగలిగెను. కాని యాచిన్నదాని ప్రయాణముమాత్ర మంతటితో సఫలముకాలేదు. ఆయువతివలన నౌషధముపుచ్చుకొనుటకు రాజొకపట్టున నొప్పుకొనలేదు. ఆమె తాను లోకప్రసిద్ధుఁడైన ధన్వంతరియొక్క కూఁతురననియు, ఆమందు తనతండ్రి యావజ్జీవమును ధారపోసి శ్రమపడి సంపాదించిన తిరుగులేని సంజీవనౌషధమనియు, చెప్పి యా యమూల్యౌషధప్రయోగముచేత మూఁడుదినములలో వ్యాధి లొంగకపోయిన పక్షమున తనప్రాణములనిచ్చెదనని శపథముపలికినమీఁదట తుదకు రాజాయౌషధసేవచేయుట కంగీకరించెను. కాఁబట్టి మూఁడుదినములలో

రాజువ్యాధియైననుపోవలెను; సతీమణితలయైనను పోవలెను. నిజముగా వ్యాధియే నిర్మూలించినపక్షమున, కావలసిన వస్తువాహనముల నన్నిటి నిచ్చుటయేకాక యామె కోసలదేశములో నెవ్వనిఁగోరునో యాపురుషుని భర్తనుగా ననుగ్రహించునట్లుకూడ రాజు వాగ్దానముచేసెను. రాజును స్వస్థునిగాఁజేయుటవలన సతీమణి యపేక్షించినదియు వరలాభమేకాని ధనవస్తువాహనసమృద్ధి కాదు.

సతీమణి కాయౌషధమునందుఁగల నమ్మకము వ్యర్థముకాలేదు. మూఁడుపూఁటలు సేవించునప్పటికెల్లను రాజుయొక్క శరీరస్థితిలో కొంత గుణ మగుపడెను; మితిపెట్టిన మూఁడుదినములును మందుపుచ్చుకొనునప్పటికి రోగము నిశ్శేషముగాకుదిరి రాజునకు సంపూర్ణారోగ్యము కలిగినది. అప్పుడు రాజు నిర్భరానందపరవశుఁడయి తన యాస్థానమునందుఁగల రూపయౌవన గుణసంపన్నులయిన రాజపుత్రుల నందఱిని రావించి వారిని సతీమణికిఁజూపి ఇష్టమున్నయెడల వీరిలో నొక్కరిని భర్తగా వరింపవచ్చునని చెప్పెను ఆమె మనోవల్లభుఁడయిన విక్రమసేనుఁ డాగుంపులోనేయున్నందున, భర్తృవరణమునం దామెకు కష్టము లేకపోయెను. అందుచేత సతీమణి "యితఁడే నావల్లభుఁడ"ని విక్రమసేనునిజూపి, అతనితో "ఓప్రాణనాయకుఁడా! నేను మిమ్ముఁ బరిగ్రహించెదనని సాహసించి చెప్పఁజాలను; నన్నే మీకుసమర్పించుకొనుచున్నాను. నాయావజ్జీవమును నన్ను సేవకురాలినిగా గ్రహించి నాసేవనంగీకరింపుఁడు" అనిచెప్పెను. అంతట రాజతనినిజూచి "ఓ విక్రమసేనా! నీవీ చిన్నదానిని భార్యనుగా స్వీకరింపుము. ఈమెయే నీకు ధర్మపత్ని" అని యాజ్ఞాపించెను. అప్పుడు విక్రమసేనుఁడు సందేహింపక చంద్రకేతునితో సతీమణి బీదయింటి వైద్యునికూఁతురనియు, తండ్రిపోయినప్పటినుండియు తమయింటనేయుండి తనతల్లిసంరక్షణలో పెరిగినదనియు, అందుచేత తమకాచిన్నది పరిచారికవలె నుండినదనియు, చెప్పి యామెను పాణి

గ్రహణము చేసికొనుటకు తన కిష్టము లేదని తెలియఁజేసెను. అతఁడు చూపినతిరస్కారభావమును పలికిన నిరాకరణవచనములును మనస్సున నాటుకొనఁగా సతీమణి రాజువంకఁజూచి "ఓ దేవా! ఏలినవారదేహము స్వస్థపడినందుకు నాకు సంతోషముగా నున్నది నా కంతే చాలును. తక్కినవిషయమయి దేవరశ్రమపడవలసినపనిలేదు" అనివిన్నవించెను. కాని రాజు తనయాజ్ఞోల్లంఘన మెవ్వరును చేయరా దనిచెప్పి, ఆదినముననే పురోహితుని రప్పించి వారిద్దరకును బలవంతముగా విధ్యుక్తమయిన వివాహమును జేయించెను. ఆవివాహమువలన వధూవరులలో విక్రమసేనునకునుమనస్సునకుసుఖముకలుగలేదు;సంసారముచక్కఁబడునన్నయాశ లేకపోవుటచేత సతీమణికిని సంతోషముకలుగలేదు ఆమె ప్రాణత్యాగమునకయిననొప్పుకొని యభీష్టసిద్ధిని పొంది కోరినభర్తను వరించినను, భర్తనిప్పించుటవలె భర్తయొక్కయనురాగము నిప్పించుట కోసలాధీశ్వరుని చేతిలో లేనందున ఫలానుభవము లేనిదయి యుండనిమ్మానిపండుతన దనుకొనుదానివలెగ్రుక్కిళ్ళుమ్రింగుచుచూచిసంతోషింపవలసినదాయెను.

విక్రమసేనుఁడు వివాహముకాఁగానే భార్యనుజూచి తా నయోధ్యను విడుచుటకయి రాజువద్ద సెలవుపొందుమని చెప్పెను. ఆమెరాజును ప్రార్థించి కోరినప్రకారముగా సెలవిప్పింపఁగానే విక్రమసేనుఁడు భార్యను జూచి, వివాహ మాకస్మికముగా జరిగినందున తన మనస్స్వాస్థ్యము చెడిపోయినదనియు, అందుచేత తాను దూరదేశయాత్ర పోనుద్దేశించుకొన్నాఁడననియు, చెప్పి, ఆమెను తనతల్లియొద్దకు పోయియుండవలసినదని యాజ్ఞాపించెను అందుమీఁద నాయువతి మనస్సులో ఖేదపడి, దుఃఖము పయికికనఁబడనీక భర్తనుజూచి ధైర్యముతో 'ఓప్రాణేశ్వరా! నేనెప్పుడును తమయాజ్ఞకు బద్ధురాలనే. జన్మముచేత మీతోసమానురాలనయ్యెడుభాగ్యము నాకీశ్వరుఁడు కలిగింపకపోయెనుగదాయనిసదా పరితాపపడుచుమీపాదసేవకురాలనయియీశరీరములోజీవమున్నంత

వఱకు మీయనుగ్రహమును సేవను గోరి వేచియుండెదను” అని చెప్పి కన్నులనీరునించెను ఆమెయొక్క మాటలుగాని కన్నీరుగాని యాతని కఠినహృదయమును కరఁగింపలేకపోయినందున, అతఁడు కొంచెమయి నను జాలిపడనివాఁడయి మాఱుమాటచెప్పక తానుపోనుద్దేశించుకొన్న దేశముపేరయినను భార్యతోఁ జెప్పక యామెను విడిచిపోయెను.

భర్తయొక్కయాజ్ఞానుసారముగా సతీమణి లక్ష్మణపుర మత్త వారింటికివచ్చెను. ఆమె రాజుప్రాణమును కాపాడి కోరినభర్తనుపొందియే స్వగృహమునకువచ్చినను, విచారగ్రస్తురాలయినిరుత్సాహముతో దీనురాలయి యత్తగారిపాలఁ బడవలసినదాయెను ఆమె భర్తృగృహము చేరునప్పటి కక్కడకు హృదయభేదనము చేసెడు పిడుగువంటియుత్తర మొక్కటి విక్రమసేనునివద్దనుండి వచ్చియుండెను.

ఉత్తమురాలయినయాసునంద తనకుమారుఁడుకోరి తెచ్చుకొన్న యుత్తమకులీనురాలయిన కోడలి నాదరించినట్లే సతీమణి నాదరించి మంచిమాటలుచెప్పి కొడుకుచేసిన యనాదరణ మఱచునట్లుగా నాచిన్న దాని నోదార్చెను కాని యామెచేసిన యాదరమువలన సతీమణి మనస్సులో సంతోషింపక, “అత్తా! నాప్రాణనాథుఁడు దేశములపాలయి పోయెను.. ఇఁక నే నాధన్యుని నవ్వుమొగమును జూడనుగాఁబోలును!” అని కంట తడిపెట్టెను. అప్పుడామె కొమారుఁడువ్రాసినయుత్తరమును దీసి. “నాచేతియుంగరమెప్పుడు నీచేతికివచ్చునో నన్నప్పుడుమాత్రమే భర్తయని పిలువుము. ఆయప్పుడనెడు కాల మెప్పుడును రాకుండునని నేనునమ్మెదను” అనిదానిలో భార్యనుగూర్చియతఁడువ్రాసినభాగమును జదివెను ఆమాటలు వినఁగానే గుండెలుపగిలి యాచిన్నది “ఇది వజ్ర కఠినమయినవాక్యము” అని పలుకుచు మొదలునఱికిన కదళీతరువువలె నేల కూలఁబడెను అప్పుడుసునంద కోడలిని కౌఁగిలించుకొనిలేవనెత్తి, శాంతతవహింపవలసినదని ధైర్యముచెప్పుచు “నాకొడుకిప్పుడు దేశాం

తరము పోయినందున నీవేనాబిడ్డ” వని యనునయించి దుఃఖోపశమనము చేసెను. కాని మనస్సునకూఱట కలుగక, సతీమణి నేలచూచుచు బొటబొట కన్నీరుకార, భర్తయుత్తరమును చేతఁబట్టుకొని చూచి “నాకు భార్య లేనంతవఱకు నాకు కోసలదేశములో నేదియు లేదు” అన్న వాక్యమును జదివెను. ఆమాట లందున్నవాయని యత్తగారు ప్రశ్న వేసెను. ఉన్నవనిచెప్పి కోడ లావయిని నోట మాటరాక చిత్రప్రతిమ వలె నిశ్చేష్టురాలయి యూరకుండెను

మఱునాఁటి ప్రాతఃకాలమున సతీమణి యెక్కడ వెదకినను కానఁబడలేదు. ఆచిన్నది యిల్లు విడిచి వెళ్ళునప్పుడొకయుత్తరము వ్రాసి యొకదాసిచేతి కిచ్చి, అది తాను వెళ్ళినతరువాత సునందచేతికిమ్మని చెప్పి పోయెను. ఆయుత్తరములో విక్రమసేనుఁడు తనయిల్లును దేశమును విడిచి దూరదేశములపా లగుటకు తాను కారకురా లయినందున కెంత యుఁ జింతించుచున్నా ననియు, తాను జేసిన యీపాపమును పోఁగొట్టుకొని లోకనిందను తొలఁగించుకొనుటకయి విశ్వేశ్వరస్వామి సందర్శనార్థము తా నిప్పుడు కాశీయాత్ర పోవుచున్నా ననియు, అతఁడంతగా ద్వేషించుచున్నభార్య మరలరాకుండ దేశాంతరము పోయినదని తెలిపి విక్రమసేనుని స్వగృహమునకు రప్పించి సుఖపడునట్లు చేయవలసిన దనియు, అత్తగారిపేర వ్రాసెను.

అయోధ్యాపురమును విడిచినతరువాతవిక్రమసేనుఁడునుతిన్నగా కాశీపురమునకే పోయి. కాశీదేశపురాజువద్ద సేనలో కొలువుకుదిరి, ఆ రాజునకును మగధదేశపురాజునకును జరగిన యుద్ధములో తనశౌర్యము ను గనఁబఱచి తనరాజునకు గెలుపు కలిగించి మహాప్రసిద్ధుఁడయి యుండెను ఇట్టుండఁగా సతీమణి దేశము విడిచిపోయినదనియు, ఇఁక నీవు స్వగృహమునకువచ్చి సుఖముగా నుండవచ్చుననియు. అతనికి తల్లి వద్దనుండి యుత్తరమువచ్చెను. ఆయుత్తరమును జూచుకొని యతఁడు స్వ

